# ఆంధ్రపత్రిక



The Andhra Patrika, Madras, } Regd No M. 1118, Vol. 34 No 147 MONDAY 22nd SEPTEMBER 1947 వెల ఒక అణా { Founder: K. Nageswara Rao

# అల్పసంఖ్యాకుల రక్షణకు ఉభయ అధినివేశ ప్రభుత్వాల ఒప్పందం

## గాంధిజీకి బుద్ధిపూర్వకంగా ముస్లిముల ఆయుధ సమర్పణ

### రహస్యాయుధ స్వాధీనానికి వివిధ నాయకుల తీవ్ర కృషి

న్యూఢిల్లీ, సెప్టెంబరు 20: ఇవ్వాళ కొందరు ముస్లింలు తమ దగ్గర ప్రభుత్వానుమతి లేకుండా ఉన్న ఆయుధాలను మహాత్మా గాంధీకి స్వాధీనపరచినట్లు తెలుస్తున్నది. వీటిలో 12 గుండ్ల ఏక బారు తుపాకి ఒకటీ, ఒక రివాల్వరూ, కొన్ని తూటాలూ, 4 కత్తులూ కూడా ఉన్నాయట. ఢిల్లీలో మహాత్మాగాంధీ నిర్విరామంగా చేస్తున్న మహత్తరకృషి ఫలిస్తోందనడానికి ఇదొక ప్రబల నిదర్శనం. మహమ్మదీయులవద్ద ఇటువంటి ఆయుధాలు చాలా ఉన్నాయన్న అనుమానంతో హిందూ సిక్కులు వారి నెంత మాత్రమూ విశ్వసించడంలేదు.

ప్రతిరోజూ చాలామంది ముస్లిం నాయకులు మహాత్మా గాంధీవద్దకు వచ్చి తమ మతంవారిలో అనుమతిలేని ఆయుధాలు ఎవరిదగ్గర ఉన్నా వాటి నన్నింటినీ ప్రభుత్వపశం చెయ్యడానికి సకల ప్రయత్నాలూ చేస్తామని హామీ ఇస్తున్నారు. ఈపటలో నాయకులతోనూ, వివిధపక్ష ప్రతినిధులతోనూ సంప్రతించడానికి మహాత్మాగాంధి డా. రామమనోహర్ లోహియా గారినీ, డా. దిన్షా మెహతా గారినీ నియమించారు.

అనుమతిలేని ఆయుధాలను వెంటనే ప్రభుత్వాని కిచ్చివెయ్యవలసిందని కోరుతూ పట్టణంనిండా ఉర్దూలో వ్రాసిన విజ్ఞప్తులు పంచిపెట్టారు. "ఆయుధాలను స్వాధీనం చేసుకోవడంలో సర్వప్రయత్నాలూ చేస్తాము. మేము భారతదేశంలో పుట్టిపెరిగిన పౌరులము. మా సమాజంలో కల్లోలాలను సర్వవిధాలా నిర్జిస్తాము. అరాచకాన్ని అణచివెయ్యడంలో మా ప్రభుత్వం కృషిచేస్తుందని మేం మాటిస్తున్నాము" అని 60 మంది స్థానిక ముస్లిం నాయకులు ఆ విజ్ఞప్తిలో ప్రకటించారు.

వివిధ వర్గనాయకుల సమష్టి విజ్ఞప్తులను కూడా పంచిపెట్టారు. లాలా దేశబంధు గుప్త, మౌలానా అహమ్మద్ సయీద్, మౌలానా హఫ్జుర్ రహమాన్, జగల్ కిశోర్ ఖన్నా, మొదలైన వారుకూడా బలవన్మతాంతరీకరణం ఇత్యాది దుష్టకార్యాలను తీవ్రంగా ఖండించారు. నిర్బంధించిన స్త్రీలను విడిచి ఇచ్చివెయ్యవలసిందనికూడా విజ్ఞప్తిచేశారు.

#### ఆయుధ స్వాధీనానికి నాయకుల నియామకం

అనుమతిలేని ఆయుధాలనూ, మందుగుండు సామగ్రినీ, ఇతర హానికరమైనసాధనాలనూ ఈ క్రింది వారికి ఢిల్లీ పౌరులు స్వాధీనపరచవచ్చునని భారతప్రభుత్వం అనుమతించింది. వీరు తమవద్దకు వచ్చిన ఆయుధాలను ప్రభుత్వానికి అప్పజెప్తారు.

మౌలానా అహమ్మద్ సయీద్, హాఫిజ్ హుసేన్, బాఘుపాయ్ మౌలానా హఫ్జుర్ రహమాన్, హాఫిజ్ మహమ్మద్ నాశిర్ బటుక్ వాలా, ఖాన్ బహదూర్ హబీబుర్ రహమాన్, డా॥ దిన్షా మెహతా, డా॥ రామమనోహర్ లోహియా, డి. ఎస్. మాలిక్.

#### ఆయుధాలకై సోదాలు

ఢిల్లీ పోలీసులు ఇవ్వాళ ఉదయం పహార్ గంజ్ ప్రాంతంలో ఆయుధాలకై తీవ్రంగా సోదాలు జరిపారు. ఇటీవలి కల్లోలాల్లో పాడుపడిన ఒక ఇంటి దిబ్బలో రెండు ప్రేలని బాంబులు దొరికాయి. కొబ్బరిచిప్పలతో చేసిన నాటు బాంబులు కూడా లభించాయి.

గతరాత్రిఅంతా ఢిల్లీ చాలా ప్రశాంతంగా ఉన్నది.

నిన్న మధ్యాహ్నం ఒక ముస్లిం హోటలు అను మహమ్మదీయేతరుడు ఆక్రమించుకున్నట్లు తెలిసి సబ్ ఇన్స్పెక్టరు సాయుధ పోలీసులతో వెళ్లి చూడగా అక్కడ భారత సైనికులు కాపలా ఉన్నారు. ఇక్కడికే మహమ్మదీయేతరుడూ రాలేదనీ, అంతా అబద్ధమేననీ వారు చెప్పారు.

న్యూయార్క్, సెప్టెంబరు 20: నగర మాజీ మేయరు, సుప్రసిద్ధ అమెరికన్ రాజకీయ నేత్త అయిన లాగార్డియా నేడు మరణించాడు. ఇతడి వయస్సు 62 సంవత్సరాలు.

## ఇండియా, పాకిస్థాన్ మంత్రుల ఢిల్లీ సమావేశ నిర్ణయాలు

### శాంతిస్థాపనకు పరస్పర సహకారం

#### కాందిశీక ప్రవాసానికి సర్వసౌకర్యాలు సమకూర్చవలెననే సంకల్పం

న్యూఢిల్లీ, సెప్టెంబరు 20: ఇక్కడ రెండురోజులపాటు జరిగిన ఇండియా పాకిస్థాన్ అధినివేశ ప్రభుత్వప్రతినిధుల సమావేశంలో ఎవరికి వారు తమ అధినివేశంలో అల్పసంఖ్యాకులు సురక్షితంగా నివసించగల శాంతిభద్రతలు నెలకొల్పడమే తమ ఆశయమని ఉభయులూ పునరుద్ఘాటించారు. శాంతిస్థాపన విషయంలో ఉభయులూ సహకరించి, పనిచెయ్యాలని రెండు ప్రభుత్వాలూ ఏకాభిప్రాయంతో ఉన్నాయి. ఇండియా పాకిస్థానల మధ్య సంఘర్షణ ఉభయులకూ వినాశనహేతువే అవుతుంది. కాబట్టి అది ఎంతమాత్రమూ ఊహించరానిదని స్పష్టపరుచుకున్నారు.

ఈ సందర్భంలో వెలువడిన పత్రికా ప్రకటన ఇల్లా తెలుపుతోంది.

సెప్టెంబరు 19, 20 తేదీలలో ఇండియా పాకిస్థాన్ ప్రభుత్వ ప్రతినిధులు న్యూఢిల్లీలో సమావేశమయ్యారు. ఇండియా తరపున ప్రధాని నెహ్రూ, ఉపప్రధాని పటేల్, సర్దార్ బల్దేవ్ సింగు, డా॥ జాన్ మథాయ్, సి. హెచ్. భాభా, కె. సి. నియోగీగార్లు హాజరయ్యారు. పాకిస్థాన్ తరపున ప్రధాని లియాకత్ అలీఖాన్, గులామ్ మహమ్మద్ గార్లు హాజరయ్యారు.

ఈ సమావేశంలో ఉభయ ప్రభుత్వ ప్రతినిధులూ దాపరికం లేకుండా చర్చించుకున్నారు. ఒకరిమీద మరొకరికి, వచ్చిన ఫిర్యాదులను పరిశీలించారు. ప్రాక్పశ్చిమ పంజాబులలోనూ ఇతర ప్రదేశాల్లో కూడా శోచనీయమైన సంఘటనలు జరిగాయి. ఇటువంటి వాటి వివరాలను ఎప్పటి కప్పుడు ఉభయ ప్రభుత్వాలూ పరస్పరం తెలుపుకుంటూ ఉండాలని నిశ్చయింపబడింది. వాటి విషయంలో విచారణ జరిపి దోషులుగా నిరూపింపబడ్డవారిని తీవ్రంగా శిక్షించాలని కూడా నిశ్చయించారు.

ప్రశాంత పరిస్థితులు నెలకొల్పడంలో ఉభయ ప్రభుత్వాలూ సహకరించాలనీ ఇండియా పాకిస్థానల మధ్య సంఘర్షణ అంటే సైనికంగా విరుద్ధమనడమేకాక దానివల్ల ఉభయులకూ వినాశనం తప్పదని అందరూ ఏకాభిప్రాయులై ఉన్నారు. అందుచేత కల్లోలిత ప్రాంత విస్తృతినీ, వాటి తీవ్రతనూ సాధ్యమైనంత త్వరలో తగ్గించివెయ్యడానికి ఉభయులూ సర్వవిధాలా కృషిచెయ్యాలని నిశ్చయించుకున్నారు.

వార్తాపత్రికలు అసత్య వార్తలకు ప్రాముఖ్య మిచ్చి ప్రచురిస్తున్నాయనీ, కొన్ని పత్రికల్లో వంపాదకీయాలు ప్రజలను ఉద్రేకపరిచేటట్లు బాధ్యత గుర్తించకుండా వ్రాస్తున్నారనీ ఇది నేటి పరిస్థితికి ఎంతమాత్రమూ సహాయకం కాదనీ సూచింపబడింది. ఇటువంటిపత్రికలను అదుపులో పెట్టడానికి ఉభయప్రభుత్వాలూ కృషి చెయ్యాలని నిశ్చయింపబడింది.

కల్లోలసమస్యను సంయుక్తంగా పరిశీలించడానికి వీలయేందుకు ఉభయప్రభుత్వ ప్రతినిధులూ ఢిల్లీ లాహోర్లలో పర్యాయక్రమంగా తరుచూ సమావేశమవుతూ ఉండాలని నిశ్చయించుకున్నారు.

పంజాబు పరిస్థితులు చక్కబడేవరకూ కొందరు లాహోరులో ఉండడానికి నిశ్చ

6 వ పేజీ చూడుడు

## దేశంలో తయారయే మిల్లు గుడ్డలపై 'సర్‌ఛార్జి' వసూలు

['ఆంధ్రపత్రిక' విలేఖరి]

న్యూఢిల్లీ, సెప్టెంబరు 20: దేశంలో తయారయే వస్త్రంపై ఇండియా ప్రభుత్వం కొద్దిగా 'సర్‌ఛార్జి' విధించవలెనని ఉద్దేశిస్తున్నది. ఇందుమూలంగా వసూలయే ధనాన్ని వస్త్రోత్పత్తిని ఎక్కువ చేయడానికే ప్రభుత్వం వినియోగిస్తుంది. కార్మికులచేత రోజు ఒకటికి తొమ్మిదిగంటలు పని చేయించడానికి వీలుగా ఈ డబ్బులో కొంత భాగాన్ని కార్మికులకు పంచిపెడతారు. మరి కొంత భాగాన్ని, లాభాలను 1946 స్థాయికి తెచ్చేనిమిత్తం మిలు పరిశ్రమ మిల్ యజమానులకు ఇస్తారు. ముతకగుడ్డమీద ఈ 'సర్‌ఛార్జి' వుంటుంది.

## జబ్బల్పూరులో ఇద్దరు బ్రిటిష్ ఉన్నతోద్యోగుల అరెస్టు

జబ్బల్పూర్, సెప్టెంబరు 20: ఇవ్వాళ జబ్బల్పూరులో అత్యున్నత పదవుల్లో ఉన్న ఇద్దరు బ్రిటిషు సైనికోద్యోగులు అరెస్టు చెయ్యబడ్డారు. అకస్మాత్తుగా వీరి ఇళ్లు సోదాచెయ్యగా లైసెన్సు లేని ఆయుధాలూ ఎంతో మందుగుండు సామగ్రి పట్టుబడ్డాయట.

ఈ అరెస్టు అయిన ఉద్యోగులిద్దరూ త్వరలోనే పాకిస్థానుకు పోవలసి ఉన్నది.

## 65 వేల టన్నుల ఆహారధాన్యం నాశనం

### దేశ ఆహార పరిస్థితి సమీక్ష

బొంబాయి, సెప్టెంబరు 20: భారత ప్రభుత్వ ఆహారశాఖ డైరెక్టరు జనరల్ ఆర్. ఎల్. గుప్తాగారి అధ్యక్షతన కేంద్ర, రాష్ట్ర, సంస్థానప్రభుత్వముల ప్రతినిధులు సమావేశమై అక్టోబరునెల ఆహార పరిస్థితిని గురించి చర్చించారు. అక్టోబరునెల అతిక్లిష్టముగా గడువగలదు. క్రొత్తపంటలు నవంబరునెల మధ్యవరకు సక్రమముగా అందవు. నేకరణవలన ఈ ఆదువారముల లోను చాల తక్కువ లభింపగలదు. పంజాబ్ కల్లోలముల వలన 65 వేల టన్నుల ఆహారపదార్థం నశించిపోయినది. గోధుమ 80 వేల టన్నులు, గోధుమపిండి 42 వేల టన్నులు, బియ్యం 62 వేల టన్నులు, తదితరధాన్యం 54వేల టన్నులు అక్టోబరులో దిగుమతి కావచ్చును. ఇప్పుడు ఆయా రాష్ట్ర, సంస్థానములలో వున్న సరకునుబట్టి ఆయా ప్రాంతములకు ఆహార పదార్థమును ఏవిధముగా పంపవలసినదీ వీరు చర్చించి, రేపు నిర్ణయించగలరు.

## సౌరక్ష్య సంఘ సమావేశంలో రష్యా అమెరికాల ఘర్షణ

### ఇటలీతో సంధిషరతుల సవరణ జరగాలని అర్జెంటైనా చేసిన ప్రతిపాదనపై చర్చ

ఫ్లషింగ్ మెడోస్ (న్యూయార్క్), సెప్టెంబరు 21: ఐక్యరాజ్యసమితి సౌరక్ష్య సంఘ సమావేశంలో కడచిన రాత్రి అర్జెంటైనా ప్రతిపాదించిన తీర్మానంపై సోవియట్ రష్యా, అమెరికాల మధ్య రెండుసార్లు తీవ్రఘర్షణ రేగింది. ఇటాలియన్ సంధి ఒడంబడికను సవరించాలని కోరుతూ సౌరక్ష్యసంఘ సమావేశంలో కడచిన రాత్రి అర్జెంటైనా ఒక ప్రతిపాదన ప్రవేశపెట్టింది. అర్జెంటైనా ప్రతిపాదనను బలపరుస్తూ, దీనిని ఐక్యరాజ్య సమితి ఎజెండాలో చేర్చడానికి సౌరక్ష్యసంఘం అనుమతించాలని అమెరికా ప్రతినిధి హర్షెల్ జాన్సన్ సూచించాడు. ఇంతే విధమైన షరతులను అగ్రరాజ్య చతుష్టయ విదేశాంగమంత్రులు ఆమోదించే ధోరణిలో లేరని స్పష్టపడినప్పుడు మాత్రమే, ఇటాలియన్ సంధి ఒడంబడిక షరతులను అమెరికా ఆమోదించిందని, చెబుతూ, అర్జెంటైనా ప్రతిపాదనద్వారా, ఇటాలియన్ సంధి ఒడంబడికలోని క్లిష్టమూ యిష్టమైన షరతులను సవరణ చేసే అవకాశ మున్నదని, జాన్సన్ (అమెరికా ప్రతినిధి) అన్నాడు.

అర్జెంటైనా ప్రతిపాదన విషయమై ఫ్రెంచి ప్రతినిధి తన వైఖరిని బయట పెట్టలేదు. సోవియట్ ప్రతినిధి గ్రోమికో ప్రతిపాదనను ప్రతిఘటిస్తూ యిది అసమంజసమైనదనీ దీన్ని బలపరుస్తూ చేసిన వాదోపవాదాలు నిరాధారమైనవనీ అన్నాడు. అర్జెంటైనా ప్రతిపాదనపై చర్చ రేపుకూడా కొనసాగుతుంది.

అగ్రరాజ్యాలు తమ వీటో అధికారాన్ని చాలా పరిమితంగా చలాయించాలని కోరుతూ ఆస్ట్రేలియా సూచించిన తీర్మానాన్ని సమితి ఎజెండాలో చేర్చుటకు సౌరక్ష్య సంఘం అంగీకరించింది. ఈ తీర్మానంపై జరిగిన చర్చలో ఒక్క ఇండియా తప్ప మిగతా దేశాలన్నీ రష్యా పోలండులను ప్రతిఘటించాయి.

#### ఇండియా పాకిస్థానల సభ్యత్వ సమస్య

ఐక్యరాజ్య సమితి సభ్యత్వం విషయంలో ఇండియా పాకిస్థానులను సరిసమానముగా చూడాలంటూ, అర్జెంటైనా ఒక తీర్మానాన్ని ప్రతిపాదించ దలచింది. ఈ తీర్మానాన్ననుసరించి పాకిస్థానుకు సమితి సభ్యత్వం, దానంతటదే లభిస్తుంది. ఈ తీర్మానాన్ని ఉపసంహరించుకోవల్సిందిగా, బ్రిటిషు ప్రతినిధి సర్ అలెగ్జాండర్ కాడొగన్ అర్జెంటైనాను కోరుతూ, ఇండియా పాకిస్థానల మధ్య సమితి సభ్యత్వం పొందడమనే విషయంలోగల తారతమ్యాన్ని వివరించాడు.

ఇండియా ప్రత్యేక స్థానాన్ని ఆక్రమించి ఉందనీ ఇండియా సభ్యత్వాన్ని, అంతర్జాతీయరంగంలో, స్వాతంత్ర్య రీత్యా ఇండియా వ్యక్తిత్వాన్ని హోదాను గుర్తిస్తూ తన సభ్య దేశంగా యిదివరకే ఐక్యరాజ్యసమితి గుర్తించిందనీ, అదిగాక ఐక్యరాజ్య సమితికి చెందిన సాంఘిక, ఆర్థిక విషయక సంస్థల కార్యక్రమంలోనూ శాస్త్ర సంబంధ కార్యక్రమంలో ఇండియా తన భూమికను నిర్వహిస్తోందనీ, యే విధమైన అసమ్మతి తెలుపకుండానే, ఐక్యరాజ్య సమితి, ఇండియా ప్రతినిధుల యోగ్యతలను గుర్తించినదని సర్ కాడొగన్ వివరించాడు. ఇక యిప్పుడు ఐక్యరాజ్య సమితిలో ఇండియా సభ్యత్వ దేశమా కాదా అన్న మీమాంస చాలా అసమంజసంగా ఉంటుందనికూడా ఆయన అన్నాడు.

పాకిస్థాన్ సభ్యత్వం విషయం మాట్లాడుతూ, ఐక్యరాజ్యసమితి సభ్యత్వాన్ని అర్థిస్తూ పాకిస్థాన్ దరఖాస్తు పెట్టుకొన్నదనీ, భద్రతామండలి శిఫార్సు చేసిందని, యీ సభ్యత్వం విషయాన్ని సమితి రాజకీయసంఘానికి వెంటనే నివేదించడం ఉచితమని సర్ కాడొగన్ అన్నాడు.

పూర్వ ఇండియా అధినివేశానికి, ప్రాత ఇండియా సామ్రాజ్యానికి యేమీ పోలికలేదని, అందుచేత యిప్పుడు ఇండియా పాకిస్థానల మధ్య తారతమ్యాన్ని చూపడం పొరబాటని అర్జెంటైనా ప్రతినిధి సీనర్ జోన్స్ అన్నాడు.

సాన్ ఫ్రాన్సిస్కో సమావేశం నాటి నుంచి ఇండియా పాకిస్థానలు సమితి సభ్యత్వ దేశాలేనని ఐక్యరాజ్యసమితి ప్రకటించాలి అని సీనర్ జోన్స్ సూచించాడు. ఇండియా ప్రతినిధి ఫజ్లుల్ అలీ చర్చలో పాల్గొంటూ యిలా అన్నాడు.

"పాకిస్థాన్ అధినివేశ రాజ్యం సృష్టింపబడినంత మాత్రాన, ఇండియా వ్యక్తిత్వానికి హోదాకు యేవిధమైన భంగం వాటిల్లలేదు. ఈ అభిప్రాయాన్ని, ఐక్యరాజ్యసమితి ప్రధాన కార్యదర్శి కూడా బలపర్చాడు. అధినివేశవ్యయాన్ని సృష్టిస్తూ బ్రిటిషు పార్లమెంటు ఆమోదించిన చట్టంలోగూడా, అంతర్జాతీయంగా ఇంతవరకు ఉన్న బాధ్యతలు ఒప్పందాలు అన్నీ ఇండియాకే సంక్రమిస్తాయని చెప్పబడింది. అయితే యీ ప్రశ్నను, ఐక్యరాజ్యసమితి ఎందుకు విస్మరించాలో మా ప్రస్తుతహోదా యేమిటో స్పష్టంగా కళ్లకు కనబడుతూనే ఉన్నది. ఐక్యరాజ్య

2వ పేజీ చూడుడు

## పాలస్తీనానుండి వైదొలగుటకు బ్రిటిష్ ప్రభుత్వ నిర్ణయం

లండన్, సెప్టెంబరు 20: "పాలస్తీనా సమస్యా పరిష్కారం విషయంలో, ఆచరణ యోగ్యమైన పథకాన్ని ఐక్యరాజ్య సమితి తయారు చేయిలేక పోయినట్లయితే, పాలస్తీనాపై తన ప్రాజాపత్యాన్ని వదులుకొంటూ, అక్కడ ఉన్న తన ఉత్త సైన్యాన్ని ఉపసంహరించుకోవడానికి బ్రిటన్ యివ్వాళ నిర్ణయించుకొన్నది." అని రాయిటర్ రాజకీయ విలేఖరి ఫ్రేజర్ వైటన్ తెలుపుతున్నాడు. బ్రిటిషు మంత్రివర్గం నేడు జరిపిన ప్రత్యేక సమావేశంలో, పాలస్తీనా నుండి వైదొలగాలనే నిర్ణయానికి వచ్చినట్లు రూఢిగా తెలుస్తున్నది. కాని వచ్చేవారం పాలస్తీనా సమస్య చర్చకు వచ్చినపుడు ఐక్యరాజ్య సమితి యేవైనా క్రొత్త ప్రతిపాదనలను సూచించే యెడల వాటిని పరిశీలించడానికి బ్రిటిషు ప్రభుత్వం కొంచెం అవకాశం ఉంచుకొన్నది.

పాలస్తీనా సమస్యా పరిష్కార మార్గాన్ని సూచిస్తూ ఐక్యరాజ్య సమితి ప్రత్యేక సంఘం ప్రతిపాదించిన పథకాన్ని చర్చించడానికిగాను, బ్రిటిషు మంత్రివర్గ సమావేశం యీరోజున జరిగింది. మంత్రులంతా యీ సమావేశంలో పాల్గొన్నారు. ఈ సమావేశానికి అట్లీ అధ్యక్షత వహించాడు.

## జునాఘడ్‌కు భారతప్రభుత్వ సందేశం

### పాకిస్థాన్‌లో సంస్థాన ప్రవేశం

రాజకోట, సెప్టెంబరు 19: భారత ప్రభుత్వం తరఫున అతిముఖ్యమైన సందేశాన్నొకదానిని జునాఘడు సంస్థానాధిపునికి అందజేయడానికిగాను, ప్రాంతీయ కార్యదర్శితోటి, ఆయన డిప్యూటీతోటి కలిసి ఆ సంస్థానానికి వెళ్లివచ్చినట్లు, వి. పి. మీనన్ (భారత సంస్థాన మంత్రి శాఖా కార్యదర్శి) యీ సాయంత్రము పత్రికా విలేఖరుల సమావేశంలో వెల్లడించాడు.

నవాబ్ అస్వస్థతగా ఉండడం చేత ఆయనను కలుసుకొని భారత ప్రభుత్వ సందేశాన్ని స్వయంగా అందజేయడం పడలేదని, దివాన్‌తో కలిసి మాట్లాడానని మీనన్ వెల్లడించాడు.

"జునాఘడ్ పాకిస్థాన్‌లో చేరడం మూలంగా యేర్పడిన పరిస్థితిని, ముస్లిమేతర ప్రజలలో సంభవించిన ఆందోళనను, భయాన్ని, మేము దివాన్‌కు వివరపర్చాము. హిందువుల హక్కులను సంరక్షిస్తామని, వారి కేవిధమైన అన్యాయం జరుగకుండా చూస్తామని, దివాన్ హామీ యిచ్చాడు. భారతప్రభుత్వ సందేశాన్ని నవాబ్‌కు అందజేస్తానని దివాన్ మాకు మాటయిచ్చాడు."

## స్థితిగతులు

[స్వకీయ విలేఖరి]

బొంబాయి, సెప్టెంబరు 18: అల్ప సంఖ్యాక సంఘాలకు బొంబాయిలో ప్రస్తుత మున్నంత ప్రాముఖ్యత మరియే రాష్ట్రంలోనూ లేదు.

తాత్కాలిక గవర్నరు: సర్ హోమీమోడి పార్శీ; ప్రభుత్వప్రధానకార్యదర్శి: సర్ ఐవన్ టాంటను, యూరోపియను; ప్రధాన రాష్ట్ర మేజస్ట్రేటు, ఆస్కార్ బ్రౌన, ఆంగ్లో హైందవుడు, బొంబాయి షెరిఫ్: శ్రీమతి సా. మి త్యా లామ్, పార్శీ, మేయరు, అర్దేషిర్ పి. సభావాలా, పార్శీ, స్మాల్ కాజుస్ కోర్టు ప్రధానజడ్జి, మార్కెనోరోన్హా, క్రైస్తవుడు, ప్రధాన న్యాయమూర్తి: ఎం. సి. చాగ్ల, ముస్లిం, రాష్ట్ర విద్యాశాఖ సలహాకర్త: సయ్యద్ దీను, ముస్లిము.

హైదరాబాదు రాజ్యమున జరిగెడి దురంతములనుగూర్చి బొంబైనగరంలోని మరాఠీ, గుజరాతీ పత్రికలు వివరంగానూ, ఆంగ్లభాషా పత్రికలు క్లుప్తంగాను వార్తలు ప్రకటించుచున్నాయి.

హైదరాబాదునుంచి బొంబాయి రాష్ట్రానికి సుమారు వెయ్యిహిందూకుటుంబాలు వచ్చినాయని, అనుకుంటున్నారు ఇక్కడి సంస్థాన కాంగ్రెసు సంఘమువారు.

కాఠియావారులోని జునాగడు సంస్థానము పాకిస్థానుతోటి సంబంధమేర్పరుచుకొన్నది మొదలు ఆరాజ్యమున ప్రభుత్వోద్యోగులుగా నుండిన హిందువులు కొందరు రాజీనామాలనిచ్చినారు. హిందూ జాగీర్దారులందరూ సమావేశమై నవాబుగారి తీర్మానమునకు తమ ప్రతికూల అభిప్రాయమును తెలిపినారు.

నవాబు అనుచరులు మాత్రము విచ్చలవిడిగ ప్రవర్తించుచున్నట్లు తెలియుచున్నది. దుండగీండ్రు కొందరు సుమారు 300 మంది హరిజనులను తొందరపెట్టి జునగడునగరమునుంచి మరొకపల్లెకు తీసుకవెళ్లి మహమ్మదీయమతంలోనికి కలిపినారని బొంబాయికి వచ్చిన వార్తలు తెలుపుచున్నవి. జునాగడునుండి హిందువులు కొందరు పరిసరజిల్లాలకు వలస వెళ్లుచున్నారు.

పంజాబు, సింధు రాష్ట్రములనుండి బొంబాయి రాకలసివచ్చిన సిక్కులు చాల ఆందోళనాపూరితులై యున్నారు. కాని హిందువులు మాత్రము శాంతియుతముగ నున్నారు.

బొంబాయి, అహమ్మదాబాదు నగరాల నుండి సుమారు మూడువందలమంది తురక కుటుంబాలు గడచిన మూడువారాలలో సింధుకు వెళ్ళినాయి. ఇంకా కొన్ని సుప్రసిద్ధ కుటుంబాలవారు కూడ వెళ్ళిపోవనున్నారు. సుప్రసిద్ధ ముస్లిము వర్తకులకు మాత్రము పాకిస్థానులో వ్యాపారము బాగుగ సాగునను నమ్మకములేకయున్నది.

హరిజనులకు దక్క మరింక అల్పసంఖ్యాక వర్గములకు భూమియందుగాని విద్యయందుగాని ప్రత్యేక సౌకర్యములను ప్రభుత్వము వారొసగజాలరని బొంబాయి శాసనసభలో ప్రధానమంత్రి బి. జి. ఖేరుగారు ప్రకటించిన సమాధానము రాష్ట్రవాసులయందు సంచలనము కలిగించినది. ప్రత్యేక మహమ్మదీయ [illegible] ప్రభుత్వమువారు [illegible] ఇవ్వగా, ఈ విషయమున్నను ముస్లిములు [illegible] ఆశలను [illegible] తాము సమాధానం [illegible] తము స్వభావం [illegible] ఇరువదియైదు సంవత్సరాల నుంచి ప్రచారంలోనున్న మండలి ముస్లింలీగువారు [illegible] ప్రజాతీ [illegible].

## కార్మికులరేషన్ తగ్గింపు

### రైల్వే, మోటారు కార్మికుల సమ్మె

వరంగల్, సెప్టెంబరు 19: రైల్వే సిబ్బందివారు, రోడ్డురవాణా సిబ్బంది వారు సంయుక్తంగా మొన్నటినుండి సమ్మెచేయుటవలన ఖాజీపేట రైల్వేస్టేషనులో ప్రయాణీకులు ఇబ్బందిపడిరి. కార్మికుల రేషనును యూనిట్‌కు నెల 1 కి 6½ శేరునుండి 3½ శేరుకు తగ్గించుటను నిరసించుచు వారు సమ్మె చేయుచున్నారు. కార్మికులు పనులలో చేరుటకు అధికారులు తనప్రయత్నం చేయుచున్నారు. ఇంతవరకు అధికారులకు కార్మికులకు ఏ విధమైన సమాధానమూ కుదురలేదు.

## విద్యార్థులపై లాఠీఛార్జి

వరంగల్లు, సెప్టెంబరు 17: విద్యార్థి యూనియన్ ఆదేశానుసారం, వరంగల్లు పట్టణ విద్యార్థులు సమ్మెసాగించి, హైదరాబాదు ఇండియన్ యూనియన్‌లో చేరవలెననీ, నిర్బంధింపబడిన విద్యార్థి నాయకులను విడుదల చేయాలనీ, సభచేశారు. అట్టి వారిపై, సుమారు రెండువందలమంది రిజర్వు పోలీసులు, ఎటువంటి హెచ్చరిక చేయకముందే, తీవ్రంగా లాఠీచార్జీ చేశారు; తత్ఫలితంగా 15మంది విద్యార్థులకు తీవ్రమైన గాయాలు తగిలినవి. 28 మంది విద్యార్థులను పోలీసులు నిర్బంధించి ఆరాత్రికి 24 మంది విద్యార్థులను విడుదలచేసినారు. మిగతా నలుగురిని మాత్రం జైలులోనే నిర్బంధించి వున్నారు.

నిన్న సాయంత్రం మూడు గంటలకు ప్రముఖ న్యాయవాది శ్రీ కేశవరెడ్డి గారిపై వారు తమ స్వగృహంలోని ఆవరణలో వుండగా ఒక గూండా తుపాకి గురిపెట్టి కాల్చాడు. వారి యెదురొమ్ముపై భాగాన తీవ్రమైన గాయం తగిలింది.

శ్రీ కేశవరెడ్డిగారిపై జరిగిన అత్యాచారానికి నిరసన తెలుపుతూ, నేడుకూడా వరంగల్లు ఉస్మానియా కాలేజీ విద్యార్థులు సమ్మె సాగిస్తున్నారు.

వరంగల్లు సెంట్రల్ జేలులో రాజకీయ ఖైదీల నిరశనవ్రతాన్నిగూర్చి, హైదరాబాదుసంస్థాన పౌరులు కొందరు భారత ప్రభుత్వ ప్రధానమంత్రి పండిత జవహార్‌లాల్ నెహ్రూ, సర్దార్ వల్లభాయి పటేలు, డాక్టరు పట్టాభి సీతారామయ్య నిజాం ప్రధాన మంత్రి ఛటారీ నవాబు జైళ్లమంత్రి ఆరాముద అయ్యంగార్, మొదలగువారికి తంతినిచ్చారు. వారి తంతిలో రాజకీయఖైదీల పరిస్థితి బాగా లేదనియును, వెంటనే జోక్యం కలిగించుకోవలసిందనియు సూచించారు.

## సత్యాగ్రహం అరెస్టులు

నిజాం సంస్థాన కాంగ్రెస్ కార్యాలయకార్యదర్శి ఈ దిగువ ప్రకటనచేశారు: కరీం నగరంలో క్రిష్ణరావు, హనుమంతరావు, రామకృష్ణరావు, మురళీధరరావు గార్లు సత్యాగ్రహంచేశారు. పోలీసులు వారిని అరెస్టుచేశారు. విద్యార్థులు 15 వ తేదీన సమ్మెచేశారు. లారీల కొలదీ సైనికులు అనుగామి పల్లి పంపుతున్నారు. నారాయణ ఖేడు తాలూకా కోడ్లీ, సంగము గూడూరలలో మారుతి చారి, మరిద్దరు సత్యాగ్రహం చేసి అరస్టయారు. యాకటిలో లక్ష్మారెడ్డి, మాణిక్యరెడ్డి, రామిరెడ్డి, వెన్నారెడ్డి, సత్యాగ్రహంచేసి అరస్టయారు. తాలూరు పరిసరంలోని మోకాని, సాస్తూరు, మనూదీగ్రామంలో మొత్తం 68 మందిసత్యాగ్రహంచేశారు. సంగారెడ్డి తాలూకా జైపల్లీలో చన్నయ్యస్వామి, [illegible], మరి 16 గురుకాంగ్రెస్ వారూ సత్యాగ్రహంచేసి అరెస్టుఅయారు. హిజ్జాపూర్ తాలూకా అచ్చిలేరులో విశ్వంభరరావు హడాల్కర్ గారు సత్యాగ్రహం చేసి, చాలాచోట్ల ఉపన్యసించి, అచ్చిలేరునుంచి ఫర్లోవరకు ఊరేగింపు నడిపారు. నందిగాంలో బహిరంగసభలో ఉపన్యసించాలని పోతుండగా వారిని మరి 7 గురితో పాటు అరెస్టుచేసినట్లు దుర్గం పారు. తుల్జాపూర్‌లో గంగాధరస్వామి, గురయ్యస్వామి, మరిద్దరూ సత్యాగ్రహం చేసి అరెస్టయారు. పీన్మర్ నగరంలో దిగంబరరావు కాయన్నగారు 'యూనియన్ ఆఫ్ హైదరాబాద్' అనే పేరుతో ఉన్న కరపత్రం పంచిపెట్టుచుండగా అరస్టయారు. అంబదాసరావు, దిగంబర్గారు హైదరాబాద్ రక్షణనిబంధన 119 ప్రకారం అరెస్టు అయారు. ఔరంగాబాద్ తాలూకా కింగాన్ గ్రామంలో శ్రీ షేక్సన్ సోన్యాస్, విఠల్‌రావు సోన్యాస్, దామోదర్ [illegible] గారు అరెస్టుఅయారు. ఔరంగాబాద్‌లో ఇద్దరు సత్యాగ్రహం చేసి అరెస్టు అయారు. స్థానిక విద్యార్థులు 15 వ తేదీన హర్తాళ్ జరిపారు. నాందేడ్ జిల్లా కొంధార్‌లో 8 మంది [illegible] తాటి చెట్లను కొట్టవేశారు. ఈ సమాచారం తెలిసి పోలీసులూ, జిల్లా కలెక్టరు అక్కడికివెళ్లి అటువంటి పనులు చేయవద్దని ప్రజలను ప్రతిమాలారు. [illegible] లారీల నిండా సైనికులపోయి ఇదిఇస్తాం అట్లా చెట్లను కొట్టివేయకండి అని కోరారు.

గుల్బర్గాలో విద్యార్థులు 15 వ తేదీన సమ్మెచేశారు. భారత పతాకాలు పుచ్చుకొని, నినాదాలు చేసుకొంటూ ఊరేగింపు జరిపారు. కొద్దిమందిని పోలీసులు అరెస్టు చేశారు కాని తరవాత వదలిపెట్టారు.

### పత్రికలపై నిర్బంధానికి 'రయత్' అసమ్మతి సూచన

నిజాం ప్రభుత్వం పత్రికలపై విధించిన నిర్బంధాలకు అసమ్మతి సూచనగా, శ్రీ మందుముల నరసింగరావుగారి 'రయత్' పత్రికలో రెండు కాలాలు, 'కరీం నగరంలో అరెస్టులు' అన్న మొదటి శీర్షికయూ, నాటికింద ఊరుపేరూ, తేదీమాత్రం వేసి మిగతా అంతా ఖాళీగా వదిలివేశారు.

సంస్థాన కాంగ్రెస్ కార్యాలయ కార్యదర్శిగారు, ప్రభుత్వం పత్రికలపై విధించిన నిర్బంధాలను నిరసిస్తూ ఇటువంటి చర్యలు ఉద్యమాన్ని ఏ విధంగానూ నిరోధించజాలవనీ, ఉద్యమానికి ప్రతికూలంగా వున్న వారికి ప్రభుత్వం ఎంత మద్దతు ఇచ్చినా ఉద్యమానికి బలం చేకూరుతుందనీ ఒక ప్రకటన చేశారు.

### కాశీనాథరావు వైద్యప్రకటన

ప్రముఖ కాంగ్రెస్‌వాది శ్రీ కాశీనాథరావువైద్యగారీ విధంగాప్రకటిస్తున్నారు: నిజాం సంస్థానం భారతసమాఖ్యలో చేరాలనీ, సంస్థానంలో వీలైనంత త్వరలో బాధ్యతాయుత ప్రభుత్వం నెలకొల్పాలనీ సంస్థాన కాంగ్రెస్ కోరింది. ఇత్తెహాదుల్ ముస్లిమీన్ ఈరెండు కోరికలకూ ప్రాతికూల్యం తెలిపింది. ఆ సంస్థ నాయకులు ఈ కోరికలను బలంతో ప్రతిఘటిస్తామన్నారు. అందులో తాము ప్రభుత్వంపైన ఆధారపడమనీ, స్వబలంతోనే అంతా చేస్తామనీ, అవసరమైతే ఆయుధాలు ఉపయోగించడానికి వెనుదీయమనీ అన్నారు.

ఈసంస్థ స్థాపితమైనప్పటినుంచీ దీనికీ ప్రభుత్వానికీ ఎన్నడూ పేచీ రాలేదు. ప్రభుత్వం ఈ సంస్థ కోరికలను నెరవేరుస్తూ వచ్చింది. సర్ మీర్జా ఇస్మాయిల్ రాజీనామా ఇవ్వాలని ఈసంస్థ కోరితే నవాబుగారు వెంటనే ఇస్మాయిల్‌గారి రాజీనామాను ఆమోదించారు. ఇప్పుడు ఈ సంస్థ ప్రభుత్వకార్యవర్గాధ్యక్షునిలోనూ, ఇద్దరు మంత్రులలోనూ తనకు విశ్వాసంలేదని తీర్మానంచేసింది. వారు, భారతసమాఖ్యలో చేరడానికి ఒప్పుకొనడంద్వారా ఇస్లాంరాజ్యానికి ద్రోహంచేసారని ఆరోపించింది. ఈ విషయమై నవాబుగారు ఇప్పటికి మూడుసార్లు తమ మంత్రులలో విశ్వాసం వున్నదని వెల్లడించి ఈ సంస్థను జాగ్రత్తగా వివేకంతో ప్రవర్తించవలసిందని మెల్లగా మందలించారు. అయినా ఈ సంస్థసాయిసంఘం మంత్రులలో విశ్వాసంలేదన్న కార్యవర్గ తీర్మానాన్ని ఆమోదించింది.

దీనినిబట్టి నవాబుగారూ ప్రభుత్వము భారత సమాఖ్యలో చేరడానికి ఉన్ముఖులైఉన్నారనీ, ఇత్తెహాదుల్ ముస్లిమీన్ అందుకు ప్రతికూలంగా ఉన్నదనీ స్పష్టమవుతోంది.

ముస్లిమీన్ సంస్థలో చాలామందివున్నారు. కాని వారికి మెజారిటీలేదు. ఈ సంస్థను చెందని ముస్లిములూ అనేకులున్నారు. సంస్థానం భారతసమాఖ్యలో చేరక తప్పదని వారు గ్రహించారు. అటువంటివారు ఇప్పుడు ముందుకు వచ్చి తమ మతమేమిటో తెలియజేసి, నచ్చచెప్పాలి. ప్రభుత్వం ఇత్తెహాదుల్ ముస్లిమీన్ సంస్థ బెదిరింపులకు భయపడరాదు. ధైర్యంగా తమ ఉద్దేశాన్ననుసరించి సమాఖ్యలో చేరాలి.

ఏమాత్రం పొరపాటైనా సంస్థానాన్ని అల్లకల్లోలంలో ముంచి, దాని నాశనానికి దారితీస్తుంది.

### కొండా వెంకటప్పయ్యగారి ప్రకటన

గుంటూరు, సెప్టెంబర్ 19: దేశభక్త శ్రీ కొండా వెంకటప్పయ్య పంతులుగారు నిజాంసంస్థాన స్థితిగతులను గురించి ఈ విధంగా ప్రకటిస్తున్నారు:

నిజాం సంస్థానంలోని సికందరాబాద్, వరంగల్ మొదలగు ప్రదేశాలనుంచి దాదాపు ప్రతిరోజూ తీవ్రమైన మతకల్లోలాలకు సంబంధించిన వార్తలు వస్తున్నవి. ప్రాణాలు కాపాడుకోవడానికి ఎంతోమంది ఆ ప్రదేశాలనుంచి బెజవాడ, బందరు, గుంటూరు, రాజమండ్రి, మొదలైన ప్రదేశాలకు పారిపోయి వస్తున్నారు. కత్తులతో పొడుస్తున్నారనీ, ఇండ్లు లూటీలు చేస్తున్నారనీ, తగులపెడుతున్నారనీ వారు చెపుతున్న అంశాలు భయంకరంగా వున్నాయి. ఈ విధంగా ప్రజలు వస్తూండడంవల్ల ఈ ప్రాంతాల ప్రజల ఆర్థిక స్థితిగతులు విపరీతంగా మారుతున్నాయి. బాహాటంగా, విస్తారంగా [illegible] జరుగుతున్న ఆహారసమస్య [illegible] రాష్ట్రప్రభుత్వం జోక్యం చేసుకోవలసిన అవసరం వచ్చేది. అయినా రాష్ట్రప్రభుత్వం ఈ స్థితిగతులను నిర్లక్ష్యం చేయడానికి వీలులేదు. పొరుగు ప్రభుత్వం కనుక తనకుగల బాధ్యతలను పురస్కరించుకొని, ఈ విధంగా ప్రజలు వచ్చివేయడానికి కారణమేమిటో దర్యాప్తుచేసి, ఆ కల్లోలాలను అణచివేసి, శాంతిభద్రతలు నెలకొల్పి ప్రజలు భయభ్రాంతులు లేకుండా తమ ఇండ్లకు మరలిపోయే అవకాశం కలిగించవలసినదని నిజాం ప్రభుత్వాన్ని కోరాలి.

అదట్లావుండగా, నిజాం సంస్థానంలో కొంతకాలంనుంచీ రాజకీయ అసంతృప్తి, దానిపై ప్రభుత్వం అవలంబించిన తీవ్రదమననీతి కొనసాగుతున్నాయి. నిజాం నవాబుగారు భారత సమాఖ్యలో చేర నిరాకరించడం, తమ సంస్థానం సర్వస్వతంత్రమైనదని ప్రకటించడం మూలంగా సంస్థాన కాంగ్రెసునాయకత్వాన విస్తృత ఆందోళన ప్రారంభమైంది. బాధ్యతాయుత ప్రభుత్వం కావాలని కాంగ్రెసువారు, సత్యాగ్రహోద్యమం ప్రారంభించారు. అరెస్టులద్వారా ఈ ఉద్యమాన్ని అణచివేదామని ప్రభుత్వం ప్రయత్నిస్తోంది. సత్యాగ్రహంలో ఒక భాగంగా ఇప్పుడు తాటిచెట్లను కొట్టివేయడం జరుగుతోంది.

సంస్థానకాంగ్రెస్ అధ్యక్షుడు స్వామి రామానందతీర్థగారు జైలులో వున్నారు. ఇతర నాయకులు, అనేకమంది సేవకులు సత్యాగ్రహంచేస్తూ అరెస్టు అవుతున్నారు. ప్రజల ఆశయాలను, భావాలను ఎంతమాత్రము పరిగణించకుండా నిరంకుశంగా వ్యవహరించి, అరెస్టులద్వారా, గ్రుడ్డి దమననీతిద్వారా నెగ్గగలమనే పురాతన అభిప్రాయంతోనే ప్రభుత్వం ఉన్నట్లు కనపడుతోంది. ఆంధ్రప్రభనూ, మరో ఉర్దూ పత్రికనూ నిషేధించడంవల్ల ప్రభుత్వం యెంత భయసంకోచాలతో ఉన్నదో తెలుస్తున్నది. నిజాం నవాబుగారు ఇప్పుడైనా యీ దమననీతివల్ల వినాశకర పరిణామాలు కలగడం తప్ప అన్యంచేకూరదని గ్రహించి, తన సంస్థానంతో సమాన గౌరవ ప్రతిష్ఠలుగల తిరువాన్కూరు మొదలైన సంస్థానాలలో ఏమి జరుగుతున్నదో చూసి గుణపాఠం నేర్చుకోవాలి. మొదట స్వతంత్రంగా ఉందామని ఉద్దేశించిన తిరువాన్కూరు ఈనాడు ఇండియన్ యూనియన్‌లో చేరడమే కాకుండా, బాధ్యతాయుత ప్రభుత్వం ఏర్పాటు చేస్తానని ప్రకటించింది. మైసూరు సంస్థానంకూడా అల్లానే చేసింది. భోపాల్ సంస్థానంకూడా ఇండియన్ యూనియన్లో చేరింది. వివేకవంతుడైన భోపాలునవాబు తన సంస్థానంలో బాధ్యతాయుత పరిపాలన నెలకొల్పడంలో ఇతర సంస్థానాలకు వెనకపడడని నమ్ముతున్నారు. నిజాం నవాబుగారు తాము విడిగా, నిరంకుశాధికారంతో ఉండాలన్న నిశ్చయానికి అంటిపెట్టుకొని ఉండడానికి నిశ్చయించేటప్పుడు ఆయనకూడా ఇదేవిధంగా చేయాలని ప్రాబల్యం చేసేందుకు ఈ నిదర్శనలు చాలు.

చెన్నరాష్ట్ర ప్రజలమైన మేము, మా పొరుగునవున్న నిజాం సంస్థానంలోని అశాంతి స్థితిగతుల నిర్లక్ష్యంచేయలేము. మహారాష్ట్ర కాంగ్రెస్ కార్యవర్గం పూనాలో సమావేశమై సంస్థాన కాంగ్రెస్ ఉద్యమాన్ని బలపరుస్తూ తీర్మానించింది. ఆంధ్ర ఇతర రాష్ట్ర కాంగ్రెస్ సంఘాలుకూడా వెంటనే సమావేశమై, ఉద్యమాన్ని బలపరుస్తూనూ, నిజాంప్రభుత్వ దమననీతికి అసమ్మతి తెల్పుతూనూ తీర్మానాలు చేయాలి.

అవసరమైనప్పుడు ఉద్యమానికి మద్దతు ఇచ్చేందుకుగాను ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సంఘం ఉద్యమం పొడసూ, అశాంతికి దారితీస్తున్న స్థితిగతులనూ జాగ్రత్తగా గమనిస్తూండాలని కోరుతున్నారు.

## బుడమేరు రిజర్వాయరు

### మూడు స్కీములు ఆలోచనలో నున్నవి

ప్రభుత్వంవారు యిట్లు ప్రకటిస్తున్నారు.

కృష్ణ జిల్లాలో యిటీవల వరదలు వచ్చినందున బుడమేరునందు రిజర్వాయరు కట్టు సూచనలు పరిశీలింపబడుచున్నవి. ఇప్పటి లెక్కను రూ 25 కోట్లు ఖర్చయ్యే 60000 లక్షల ఘన అడుగుల నీరు నిలిచే రిజర్వాయరు కట్టే స్కీము 1946లో తలపెట్టబడెను. అది చాలా పెద్దదగునని వేరొకటి రూ 65 లక్షల ఖర్చుతో 20000 ల. ఘ. అ. నీరుగలది పరిశీలింపబడెను. దీనివల్ల లాభం పొందే విస్తీర్ణానికి మించిన ఖర్చగుననియు, 2/5 వంతు ఖర్చు నేలలవారు పరిహారం క్రింద పోవుననియు ఎంచి, మూడవ స్కీము తలపెట్టబడెను. దీని వివరాలు త్వరలో తెలియగలవు. ప్రభుత్వం వారు యీ మూడు స్కీములను ఆలోచించి త్వరలో నిర్ణయం చేసెదరు.

ఏలూరు కాల్వద్వారా బుడమేరువరదను తొలగించు ఏర్పాటులుగూడ ఆలోచనయందున్నవి; ఉప్పుటేరు వెడల్పుచేయు ఆలోచనగూడ యుంది. చీఫ్ ఇంజనీరుగారు యిటీవల బెజవాడ పోయినపుడు యీ స్కీములన్ని స్థానికోద్యోగులతో ఆలోచించిరి.

## ఆంధ్రచిత్రకళా ప్రదర్శనం

### రాధాకృష్ణనుగారి ప్రారంభోపన్యాసం

చెన్నపురి, సెప్టెంబర్ 21: "మానవాత్మకు ఒక స్వేచ్ఛను నిచ్చి సత్యగంభీరాంతరాళములకు గొనిపోవుటయే కళయొక్క పరమార్థము. కళ సర్వసరిహద్దులను అతిక్రమించి, హృదయసాన్నిహిత్యము కలిగించి, మానవు సాక్షాత్కరించిన సార్వజనీనతకు ప్రాధాన్యత వహించును. ఈర్ష్యాదిద్వేషములు, అమానుషచర్యలు బలియగుచున్న ఈ సమయము, కళాప్రదర్శనముల వంటి సంతోష కార్యక్రమములకు యోగ్యమయినదేనా అని సందేహము జనింపవచ్చును. కాని ఇట్టి ప్రదర్శన మా నిర్వేదముల నుపశమింపచేయ సంజీవి." అని డా॥ సర్వేపల్లి రాధాకృష్ణయ్యగారు ఆంధ్రకాంగ్రెసువారిచే ఏర్పాటు చేయబడిన అఖిలభారత ఖాదీ కళాప్రదర్శనపు కళాశాఖను ప్రారంభోత్సవము చేయుచూ ఉపన్యసించిరి. శ్రీబులుసు సాంబమూర్తిగా రధ్యక్షత వహించిరి. కళాప్రదర్శనము వి. పి. హాలులో ఏర్పాటుచేయబడెను.

శ్రీ చామకూర సత్యనారాయణగారు అతిథులకు స్వాగతము చెప్పిరి.

డా॥ రాధాకృష్ణయ్యగారింకనూ ఇట్లు ఉపన్యసించిరి: "గత ఫిబ్రవరిలో, చర్చిల్ కామన్సుసభలో ప్రసంగించుచూ "భారతదేశమును బ్రిటిష్‌వారు వదలినచో, దేశము తీయు దగ్ధగృహముగామారి, శిథిలభూయిష్ఠమై, క్రౌర్య అవమానములకు ఆటపట్టగును" అనిరి. ప్రస్తుతము దేశములో ఒకభాగమున జరుగుచున్న క్రౌర్య కలాపములు, చర్చిల్ వాక్యములు నిజమేకదాయను భావమును కలిగించుచున్నవి. కాని కొంచెము వెనుకకు తిరిగిచూచిన, ఈ ఘాతుక చర్యలకు, ఈ దుర్భర బాధలకు కారకులెవరో తెలియగలరు. పెక్కు సంవత్సరాలాదిగా దుష్ప్రచారము జరిపి, కృత్రిమ బోధనల ద్వారా ప్రజలలో విపరీత సిద్ధాంతములను వ్యాప్తము చేసినవారే ఈ దారుణ సంఘటనలకు బాధ్యులు. ఆదేభావము లీనాటికిని వ్యాప్తమయి యున్నవి. ఇట్టి భావప్రేరేపణ ఫలితముగనే ఐక్యరాజ్య సమితిలో పాకిస్తాన్ ప్రతినిధి, తన ప్రభుత్వాదేశానుసారముగా, వాస్తవ దూరమైన ప్రకటనను చేయగలిగెను. ఈ క్షుభిత వాతావరణమునుంచి దేశము నుద్ధరింపవలెనన్న, శారీరిక చికిత్సయేకాక, మానసిక చికిత్సకూడా చేసికొనుట అత్యవసరము. అది భౌతిక చికిత్సకాదు; నైతికమైనదే. ఈ మానసిక, నైతిక విద్యలలో కళకుగల స్థానము అతి ప్రాముఖ్యమైనది. కళయనగా ఒకవైద్య నివేదిక గాని, మేధాచతురత గాని కాదు. మానవునకు సర్వమానవ సముదాయముతో ఏకత్వము కలిగించు ఆత్మోన్నత్యము నిచ్చునదే కళ.

నేటి ఈకళా ప్రదర్శనములో ప్రకృతికి సంబంధించిన చిత్రములేకాక, మానవ హృదయమును వెల్లడిచేయుచిత్రాలుకూడా ఉన్నవి. కాని యిట్టి చిత్రములను నేను చూచియే యుంటిని. ప్రదర్శనము యొక్క బాహుళ్యముగా గాని విస్తృతముగా గాని ఏర్పాటుచేయబడలేదు. ప్రభుత్వసహాయముతో, కళాప్రదర్శనశాలలను ఎక్కువగా స్థాపించుకొని, కళను, కళాప్రియులను పోషించి, దేశమందు కళోపాసన నెక్కుడు చేయవలసియున్నది. అప్పుడు వినూతనమైన చిత్రములను బాహుళ్యముగా ప్రదర్శించి, సార్వజనీన సంపదను అభివృద్ధిచేయవచ్చును" అని రాధాకృష్ణయ్యగారనిరి.

శ్రీ యం. కె. వి. రెడ్డిగారు వందనము లర్పించుటతో ప్రారంభోత్సవమంతమయ్యెను.

శ్రీ చామకూర సత్యనారాయణగారు చిత్రకళా ప్రదర్శనము అతిమనోరంజకముగా ఏర్పాటుచేసిరి. అనేక మంది చిత్రకారులకు ప్రోత్సాహ మివ్వబడినది. ఈ క్రింది ప్రముఖుల చిత్రములు ప్రదర్శింపబడినవి. శ్రీయుతులు చామకూర సత్యనారాయణ, వి. ఆర్. చిత్ర, దామెర్ల రామారావు, రవివర్మ, దొరైస్వామి, గంగోపాల్, సుబ్రహ్మణ్యం, జానకిరాం, పైడిరాజు, సత్యనారాయణరాజు, వెంకటరావు, అసిత్ కుమార్ హాల్దార్, లక్ష్మయ్య బాపిరాజు, వి. యస్. మూర్తి, వరదరాజన్, మహదేవన్ గారలు. శ్రీమతులు బుచ్చి కృష్ణమ్మ, కమలాబాయ్, వసంత, సత్యవాణి గారలు. తిరువాంకూరు మహారాజా కళాశాలనుంచి కొన్ని చిత్రములు శిల్పములు పంపబడినవి. చిత్రాగారు నెల్లూరువద్ద కనిపెట్టిన కొన్ని చారిత్రక శిల్పములు హైదరాబాద్, ఔరంగజేబుకు సంబంధించిన కత్తులు, డాలులు కూడా ప్రదర్శింపబడినవి.

---

మద్రాసు, సెప్టెంబరు 20:

అరటి పరిశోధన కార్యాలయాలు మద్రాసులో నొకటి, జిల్లాలలో రెండు రూ. 3½ లక్షల ఖర్చుతో స్థాపించుటకు ప్రభుత్వంవారు తలపెట్టిరి.

## మంత్రుల కర్తవ్యం

### "హరిజన్"లో గాంధిజీ వ్యాఖ్య

అహమ్మదాబాద్, సెప్టెంబరు 21: 'మంత్రుల కర్తవ్యం' అనే శీర్షికతో మహాత్మాగాంధీ నేటి హరిజన్‌లో ఇల్లా వ్రాశారు.

"తమదృష్టిలో చాలా దుబారాగా కనిపిస్తున్న మంత్రులజీవితాన్ని విమర్శిస్తూ చాలా ఉత్తరాలు నాకు వస్తున్నాయి ఒక్క దుబారాతనమే కాక మంత్రులవద్ద స్వీయజాతి పక్షపాతం చాలా ఉన్నదని కూడా వారు ఆరోపిస్తున్నారు. ఇటువంటి విమర్శలలో చాలాభాగం అజ్ఞానంవల్లవస్తాయని నాకు తెలుసు. ఇంతమాత్రంతో మంత్రులు ఉద్రిక్తులు కాగూడదు. ఎంత దూషణతో కూడిన విమర్శలోనైనా ఉన్న మంచినివారు స్వీకరించాలి. నాకువచ్చిన ఉత్తరాలనన్నింటినీ పంపిస్తేవారు నిజంగా నిర్ఘాంతపోతారేమో!

బహుశా వారివద్దకు ఇంతకన్నా ఘాటైన విమర్శలు వచ్చాయేమో! ఏమైనప్పటికీ పూర్వం అధవృల్లో ఉన్న ఇతరుల నుంచి కంటే తమంతటతామనుగా వీరు కున్న ఈ ప్రజాసేవకులనుండి నిరాడంబరత్వం, ధైర్యసాహసాలు, ఋజువర్తనం, నిర్విరామ పరిశ్రమ ఇత్యాది సుగుణాలను ఈ విమర్శకులందరూ అధికాంశికంగా ఆశిస్తున్నారని వీటినిబట్టి నేను గ్రహిస్తున్నాను. ఒక్క పరిశ్రమా, క్రమశిక్షణలలో తప్ప ఈ విషయాలలో మనం మన పూర్వాంగ్ల పాలకుల ననుకరించడానికి వీలులేదు. ఒకవంక మంత్రులు ఈ న్యాయమైన విమర్శ నుపయోగించుకోవడమూ, మరొకవంక విమర్శకులు తాము చెప్పేవిషయాల్లో మరింత నిగ్రహాన్నీ యాథార్థ్యాన్నీ పాటించడమూ అలవాటుచేస్తే నేనీ నాలుగుమాటలూ ఇక్కడ వ్రాసినందువల్ల సరియైన ప్రయోజనం సిద్ధించినట్లవుతుంది. ఎందుచేతనంటే విమర్శకులు అసత్యంచెప్పితా, అతిశయోక్తులు జోడించినా మంచి ఫిర్యాదు కూడా ఓడిపోతుంది. (ఢిల్లీకి వస్తున్న రైలులో).

## "నా శిలావిగ్రహము"

అహమ్మదాబాదు, సెప్టెంబరు 21: 'నా శిలావిగ్రహము' అను శీర్షికను గాంధిమహాత్ముడు నేటి హరిజన్‌పత్రికలో యిట్లు వ్రాయుచున్నాడు:

ఒక బహిరంగ ప్రదేశములో నా శిలావిగ్రహ ప్రతిష్ఠకై పదిలక్షల రూపాయలు వెచ్చించవలచిరని బొంబాయిలో వదంతి వ్యాపించియున్నది. ఈ సూచనను విమర్శించుచు లేఖలనేకము, వానిలో కొన్ని ఆగ్రహము వెలిబుచ్చునవి నాకు చేరినవి. ఇట్టి విపరీత సూచనను నేను గావించినట్లు వారు వ్రాసిరి. గోరంతలు కొండంతలు చేయుట మానవ ప్రకృతియై యుండవచ్చు. వివేకవంతులు మాత్రమే పొట్టునుండి గింజను వేరుచేయుదురు. ప్రస్తుత సందర్భములో మాత్రము ఈ విమర్శకు ఆధారమున్నట్లు కనిపించుచున్నది. నా ఛాయాచిత్రము తీయుటకూడా నా కిష్టములేదని చెప్పదగును. ఐనప్పటికి నా ఛాయాచిత్రములు తీయబడినవి. శిల్పులు నా నమూనాలు (మాడెల్సు) తయారుచేయుటకు నేననేక సార్లు అనుమతించితిని. ఐనప్పటికి నా శిలావిగ్రహమును తయారుచేయుటకై ద్రవ్యము ఖర్చుపెట్టు సూచనకు నేను తీవ్రముగు అసమ్మతి తెలుపవలసి యున్నది. ముఖ్యముగా ప్రజలకు తగినంత కూడు గుడ్డ లేని ఈరోజులలో నా శిలావిగ్రహమునకై ఇంత ద్రవ్యము వెచ్చించుటకు నేను తీవ్రమైన అసమ్మతి దెలుపవలసియున్నది. అందమైన బొంబై నగరంలో పారిశుద్ధ్యము జోరుగా లేదు జన సమ్మర్దము విపరీతముగానున్నది. బీద ప్రజలు కట్టకట్టుకొనియున్నారు. ఈ పది లక్షల రూపాయలను ప్రజోపయోగకరమైన కార్యములకు వినియోగించిన యెడల దానిని సద్వినియోగం చేసినట్లగును. ఇదియే ఉత్తమోత్తమమైన శిలావిగ్రహముగా నుండును. ప్రజోపయోగమునకై ఖర్చుపెట్టిన ద్రవ్యమునకు తగిన ప్రతిఫలము చేకూరును. ఎక్కువ ఆహార పదార్థములను పండించుటకు ఈ ద్రవ్యమును వెచ్చించిన యెడల ఆకలిగొన్న యెందరికి ఆకలితీరునో ఊహించుడు." (అ. ప్రె.)

## రష్యా అమెరికా ఘర్షణ

1-వ పేజీ తరువాయి

సమితి మహాసభను గుర్తించాలి. తన వాదాన్ని సమర్థించుకోడానికి న్యాయపట్ట నిబంధనలను ఉదహరిస్తూ, కొంత భూభాగాన్ని కోలుపోయినప్పటికీ, అంతర్జాతీయంగా తన ప్రతిపత్తికి యేవిధమైన భంగం వాటిల్లకుండా ఇండియా కాపాడుకుంటు నేచున్నది అంటూ, అర్జెంటైనా తన తీర్మానాన్ని ఉపసంహరించుకోవాలని ఫజ్లుల్ అలీ కోరాడు.

## భారత ప్రభుత్వంతో తిరిగి సంప్రతింపులు

### ఢిల్లీకి నిజాం అధికారుల ప్రయాణం

హైదరాబాద్, సెప్టెంబర్ 20: నిజాం సంస్థానం తరఫున భారతప్రభుత్వంతో సంప్రతింపులు కొనసాగించే నిమిత్తం ప్రధాని ఛత్తారీ నవాబ్ రాజ్యాంగ సలహాదారు సర్ వాల్టర్ మాంక్టన్ నవాబ్ అలీ నవాజ్ జంగ్ గార్లు నేడు ఢిల్లీ వెళ్లారు.

### బెజవాడలో నిజాం సి. ఐ. డి.

బెజవాడ, సెప్టెంబర్ 20: నిజాం ప్రభుత్వ సి.ఐ.డి. రాచర్ల విశ్వనాథంఅనే అతన్ని ప్రజలు స్థానిక బస్సుస్టాండు వద్ద పట్టుకొని అయ్యదేవర కాళేశ్వర రావు గారింటికి తీసుకువెళ్లారు. అతనిదగ్గర సరిహద్దు ప్రాంతాలలో రహస్యచర్యలకు సంబంధించిన ముఖ్యమైన పత్రాలు దొరికాయి. కాళేశ్వరరావు, కాకాని వెంకటరత్నంగార్లు అతనిని పోలీసులకు అప్పగించారు. పోలీసు ఉద్యోగులు అతని విషయమై ఏమిచేయాలో తెలుపవలసిందని పై అధికారులకు వ్రాసుకొన్నట్లు తెలిసింది. ఇల్లా ఒక సి. ఐ. డి. పట్టుబడ్డాడని తెలియడంతోనే వేలాదిప్రజ ఉద్రేకంతో అతన్ని చూడడానికి కాళేశ్వరరావు గారింటికి వచ్చారు.

### ఆర్యసమాజ నాయకుని అరెస్టు

హైదరాబాద్, సెప్టెంబర్ 20: ప్రముఖ ఆర్యసామాజికుడు, సంఘ సంస్కర్త హకీం గణపతిరావుగారిని 16 వ తేదీన హైదరాబాద్ రక్షణ నిబంధనల ననుసరించి అరెస్టు చేశారు.

### లెవీవసూలుకు అరబ్బుల సహాయం

గ్రామాలలో తాలూకా ప్రధాన స్థానాలలో లెవీ ధాన్యం వసూలుచేసి జిల్లాల ప్రధాన స్థానాలలోనూ, నగరంలోనూగల గోదాములకు రవాణా చేయడంలో సానికాధికారులకు సహాయంచేసేనిమిత్తం ప్రభుత్వం 2 వేలమంది సాయుధ అరబ్బులను జిల్లాలకు పంపుతున్నట్లు విశ్వసనీయంగా తెలిసింది. వీరికి రెండునెలల జీతం అడ్వాన్సుగా ఇచ్చేందుకూ రోజుకు అర్ధరూపాయ భత్యం, ఉచితంగా ఆహారపదార్థాలూ ఇచ్చేందుకూ ఏర్పాటు చేస్తున్నారని తెలిసింది. ఈసంగతి అరబ్బు నాయకుడు అరబ్బులకు తెలుపగా వారు నిరాకరించారనీ, నాయకుడు 75 మందిని బర్తరఫ్ చేశాడనీ, దానిమీదట వారు రైల్వే బస్సులలో ఎక్కి గాలిలోకి తుపాకులు పేలుస్తూ హైదరాబాద్, సికందరాబాద్ నగరాలలో ప్రదర్శనం జరిపారు. దరిమిలాను వారికి మళ్లీ ఉద్యోగాలిచ్చారు. ఇప్పటికి ఐదారువందలమంది అరబ్బులను నిజామాబాదు, నాందేడు, బీడ్ జిల్లాలకు పంపడమయింది.

### రైల్వేఉద్యోగుల యూనియన్ కార్యవర్గం రాజీనామా

నిజాంసంస్థాన రైల్వే ఉద్యోగుల యూనియన్ కార్యనిర్వాహక వర్గంలోని వారందరూ తమపదవులకు రాజీనామా లిచ్చారు.

రాజకీయ కార్యకలాపాలూ, కొందరు సభ్యులు సోషలిస్టు, కమ్యూనిస్టుపక్షాలలో చేరడమూ ఇవే రాజీనామాలకు కారణమని తెలిసింది. స్వ. వి.

### సికిందరాబాదులో గలభా ఆరుగురు అరెస్టు

ఈ రోజు సాయంత్రం సికందరాబాద్‌లో ఒకచోట గలభా జరిగి మతకలహంగా పరిణమించేటట్టుండగా పోలీసులు వచ్చి ఆరుగురిని అరెస్టుచేసి ప్రమాదం ఏర్పడకుండా చేశారు.

ఒక తురకవాడు పాలచెంబు చేత పుచ్చుకొని వెడుతుండగా పక్కనున్న ఇంట్లోనుంచి ఒక ఇటుక వచ్చి అతనికి తగిలింది. అతను తిట్టుకుంటూ పోతూండగా కొంతమంది వచ్చి అతన్ని కొట్టారు. ఇంతలో ఆ సరిహద్దు వర్తకులు అతనికి సాయమొచ్చారు. ఉభయవర్గాలూ కొట్లాట జరుగుతుండగా పోలీసులు వచ్చి ఆరుగురిని అరెస్టుచేసి, ఆ ప్రమాదం జరక్కుండా చేశారు.

బెల్లంపల్లిలో బొగ్గుగని కార్మికులు తమ కార్యాలయం మీదా, ఇంకా చాలా చోట్లా భారత పతాకాలూ, ఎర్రజెండాలూ ఎగురవేసి, నిజాం భారత సమాఖ్యలో చేరాలనీ, సంస్థానంలో బాధ్యతాయుత ప్రభుత్వం ఏర్పరచాలనీ వ్రాసిన కాగితాలు గోడలమీద అంటించారు. కంపెనీ యజమానులూ, పోలీసులూ ఆ పతాకాలను తొలగించివేశారు. యజమానులు కార్మికులకిచ్చే ఆహారపదార్థాలను మూడింట రెండువంతులు తగ్గించివేశారు. దానితో అశాంతిగల కార్మికులు సమ్మెచేశారు. తరువాత యజమానులు ఆహారపదార్థాలను పూర్తిగా ఇవ్వడానికి అంగీకరించడం, కార్మికులు సమ్మె విరమించడం జరిగింది.

# "హైదరాబాదుకు 2 నెలలు వ్యవధి"

## పటేలుగారు సూచించిరట

### మదరాసుసభలో నిరంకుశచర్య ఖండన

మదరాసు, సెప్టెంబరు 10: హైదరాబాదు, మైసూరు ప్రభుత్వములు అచటి స్వాతంత్ర్యోద్యమములను అణచివేయుటకు అనుసరించుచున్న చర్యలను ఖండించుచు, 18 సాయంకాలం గోఖలేహాలులో కె. ఆర్. కరంతుగారి అధ్యక్షతను జరిగిన బహిరంగసభలో తీర్మానించబడెను. జమిందారీలన్నియు పోతున్నాయి. మరికొంతకాలానికి యీ సంస్థానాధీసులు కూడ పోక తప్పదని అధ్యక్షులు ప్రారంభోపన్యాసమున దెలిపిరి. జి. రామచంద్రనుగారు, పాలకుల నిరంకుశత్వం తిరువాంకూరునుండి మైసూరునకు, తరువాత హైదరాబాదునకు ప్రాకినదనియు తిరువాంకూరులోవలెనే తక్కిన రెండు రాష్ట్రాలలోగూడ స్వాతంత్ర్యోద్యమం విజయము పొందగలదనియు చెప్పిరి. "జాతీయకాంగ్రెసు హైదరాబాదువిషయంలో ఎట్టి జోక్యం కలిగించుకోలేదేమని శంకరరావుదేవు (ప్రధాన కార్యదర్శిని) సాయంకాలం విద్యార్థుల కన్వెంషనులో నొకరడిగిరి. సర్దారు పటేలుగారు నైజాంకి 2 నెలలు వ్యవధియొసంగిరి. అప్పటికి నైజాం లొంగక పటేలుని ధిక్కరించినచో అపుడేమగునో చూచుకోవచ్చును. హైదరాబాద్ సమస్య ప్రపంచసమస్యయగును. బ్రిటిషు మాట్లకవలెనే యీ గోటామా ప్రస్సుకూడ ఎగిరిపోతాయి." అని జి. రామచంద్రనుగారు తెలిపిరి. అచట యింకొ విశేషమందిని చనిపోయేలోగా ఆంధ్రదేశంనుండో, మద్రాసునుండో సుమారు 2000 మంది ఇండియా పతాకంతో పోయి సత్యాగ్రహం చేయాలని సూచించిరి.

రెవ. జైటానుగారు (యూకోషియ) మైసూరులో ప్రజలు పడుచున్న యిబ్బందులగూర్చి, వివరించి చెప్పిరి.

కర్నూలు తాజేపలి శంకరశాస్త్రిగారు హైదరాబాదులో స్త్రీలను దారుణంగా హింసించి హత్యలు చేయుచున్నారనియు సంస్థానం ముస్లింలీగు పాలనలో మందిగాని నైజాంపాలనలో లేనట్లుగ వ్యవహారాలు నడుచుచున్నవనియు చెప్పిరి. ఆయుధాలు సరిహద్దులుదాటి కర్నూలు బళ్లారి కృష్ణ ప. గోదావరిజిల్లాలలోనికిగూడ దొంగతనముగా పంపబడుచున్నందున మనప్రాంతాల ప్రజలు భయపడుచున్నారనియు తెలిపిరి. చన్నరాష్ట్ర ప్రజలు స్టేటుకాంగ్రెసుకి పూర్తిగ సహాయం చేయాలనిరి.

తమిళకాలేజి విద్యార్థుల నాయకుడను సుబ్బయ్యగారును, మైసూరుశాసనసభా సభ్యుడు శ్రీకృష్ణప్పగారు కన్నడంలోను మైసూరు కాంగ్రెసుప్రజల బాధలగూర్చి తెలిపిరి. రెండు సంస్థానములందు సత్యాగ్రహోద్యమములను బలపరచుచు తీర్మానం ఏకగ్రీవంగా అంగీకరించబడెను.

## సికిందరాబాద్ నుంచి మళ్లీ ప్రజల వలస

ఆ మధ్య జరిగిన మతకల్లోలాల సమయంలో సికిందరాబాద్ నుంచి వెళ్లిపోయిన ప్రజలు కొందరు తిరిగి వచ్చారు. కాని ఈమధ్య అరెస్టులు, ప్రదర్శనలు మూలంగా ఏర్పడిన విషమపరిస్థితిని పురస్కరించుకొని తిరిగి వారు వెళ్లిపోయినట్లు తెలుస్తున్నది.

## నాగలిలేని వ్యవసాయం

నాగలి అక్కరలేకుండా 14 అంగుళాల పొడవుగల ఇనుపసాధనతో కొటిలోటలందు వ్యవసాయం చేసి 6 అంగుళ ఎత్తు 100 గాలనుల నీరుతో ఒక ఎకరంలో విశేషంగా కాయగూరలు పండించవచ్చునని కలకత్తాలోని స్టేంటిఫిక్ బీకో ఆఫ్ రూరలు వ్యవసాయ సంస్థవారు ఒక స్కీమును మదరాసు మేయరుకు పంపిరి.

### వానవల్ల పెద్దకూలుట

సేనంపేటలోనున్న కాంగ్రెసు మందిరపు ఆవరణలో హరిజన పాఠశాల విద్యార్థి వసతి గృహంపై పెద్ద చెట్టువిరిగి నిన్న రాత్రి వాన పడినపుడు, పెంకులుమీదపడి అందున్న 56 గురు బాలురలో 9 గురు గాయపడి ఆస్పత్రిలో చేర్పబడిరి.

## నారాయణరావుగారికి సన్మానం

చెన్నపట్నం జార్జిటౌనులోగల ఆంజనేయ నగరంలోని శ్రీ నవయువ బాలసేవా సమాజంవారు ఈ 13 వ తేది సాయంత్రం ప్రసిద్ధ సినిమానటుడు శ్రీ నదలవాడ నారాయణరావుగారికి సన్మానం చేశారు. 'ఆంధ్రా హెరాల్డు' సంపాదకుడు శ్రీ ...దిత్యుల రఘునాథరావుగారు అధ్యక్షత వహించారు.

ఎ. వెంకటస్వామి, ఎ. అంకయ్య అనువదకశాలను జాతీయగీతాలు పాడవంతో సభ ప్రారంభమైంది. నారాయణరావుగారు సినిమానటులందరిలోనూ ఒక ప్రత్యేకతకలవారనీ, ఒక ఆదర్శంతో వారీ రంగంలో కృషిచేస్తున్నట్లు కనపడుతుందని, ఇటువంటి ఆదర్శవాదులైన వారిని నిజాయితీ గల వారిని సన్మానించడం సమంజసమని అధ్యక్షుడు అన్నాడు.

ఎ. రాజయ్యంగారు సన్మానపత్రం చదివి సమర్పించారు.

వి. శంకరశెట్టిగారు ఈ నాడు ఇట్టి పెద్దలు కదబాటి అనబడేవారు నివసించే ప్రదేశానికి వచ్చారంటే గాంధిమహాత్ముడు చేసిన కృషే కారణమనీ, హరిజనులు విద్యా, విజ్ఞానాభివృద్ధి చేసుకోవాలని అన్నారు.

నారాయణరావుగారు సమాధానమిస్తూ తనకట్టి సన్మానాలంటే ఒకవిధమైన భయమనీ, సామాన్యంగా ఎటువంటివారిని ఉన్నవీ లేనివీ తెచ్చి పొగడ్తలు ప్రధానంగా ఉండడమే అందుకు కారణమనీ, కాని సమాజం కార్యదర్శులు చూపిన ఓర్పు, పట్టుదలవల్ల తామలాంటి ఇందుకు ఒప్పుకోవలసి వచ్చినదనీ, ఇక్కడ కట్టె వేవి లేనందుకు చాలా సంతోషమనీ అన్నారు.

అధ్యక్షుని ముగింపువాలు తర్వాత, సమాజం తరపున ఎ. రాజయ్యగారి వందనములతో సభ ముగిసింది.

శ్రీ శంకరం శెట్టిగారు హరిజన బాలురకు 20 మందికి పలకలూ బలపాలూ పంచిపెట్టి, శ్రద్ధగా చదువుకోమని కోరారు. నారాయణరావుగారు సమాజం హరిజన బాలుర విద్యాభివృద్ధికి చేస్తున్న కృషికి ...హాదంగా ఒక రూపాయలు విరాళమిచ్చారు.

# పత్రికలస్వాతంత్ర్యం

## "శుభోదయ" సన్మానంలో బోసుగారి ప్రసంగం

మదరాసు, సెప్టెంబరు 20: శరత్‌చంద్రబోసుగారికి శుభోదయ ప్రచురణముల సంస్థ నిన్నసాయంకాలం అల్పాహారవిందు సంగిరి. అపుడే విమానంలో ఢిల్లీనుండివచ్చిన డా॥ పట్టాభిసీతారామయ్యగారు, టి. ప్రకాశంగారు కే. కూర్మయ్యగారు, కె. కోటిరెడ్డి, దుర్గాబాయి, అమ్మన్నరాజా, బి. ఎస్. మూర్తిగారు పలువురు శాసనసభ్యులు న్యాయవాదులు వ్యాపారస్థులు, ఎం. ఎస్. ఎం. ఆక్టింగు జనరలుమేనేజరు ఖా. బి., క. డి. భోటుగారు మున్నగువారు సుమారు 100 మంది అతిథులు వచ్చిరి.

శ్రీ బులుసు సాంబమూర్తిగారు స్వాగతమొసంగుచు భాషాప్రయుక్తప్రాంతములిస్తు స్వపరిపాలనా సంస్థలతోకూడిన రాజ్యాంగవిధానం నిర్ణయింపవలసియున్న దనిరి. శరత్‌చంద్రబోసుగారు తనను గౌరవించినందుకు కృతజ్ఞత చెప్పుచు, రాజ్యాంగపరిషత్తులో 1935 ఇండియా చట్టము యొక్క యింకో ప్రతి తయారు చేయుచున్నారనియు, ఇండియారాజ్యాంగవిధానం రష్యా రిపబ్లిక్ సంస్థల ననుసరించియుండాలనియు సూచించిరి. హైదరాబాదు మైసూరు ప్రజల స్వాతంత్ర్య పోరాటమునకు మనమంతా సహాయం చేయాలనిరి. శుభోదయవారు స్థాపింపనున్న ఇండియను రిపబ్లిక్ పత్రిక సర్వస్వతంత్రంగా ప్రజల పత్రికగనుండాలని కోరుచున్నాననిరి.

తరువాత పలువురు చేసిన ప్రశ్నలకు బోసుగారును ప్రకాశంగారును సమాధానాలుచెప్పి, ప్రస్తుతమున్న రాజ్యాంగపరిషత్తు రద్దుచేసి, 6 నెలలలో వయోజనవోటింగుపద్ధతిని ఎన్నుకోబడిన పరిషత్తు వేరేరాజ్యాంగవిధానం నిర్ణయించుట యుక్తమని తెలిపిరి.

# తుంగభద్ర భూములు

## రైతులతరపు రాయబారం

చెన్నపురి, సెప్టెంబరు 20:

తుంగభద్ర క్రింద భూములు కొన్ని 1941 లోనూ, కొన్ని 1946లోనూ పరిహారమిచ్చుటకు ప్రభుత్వమువారు ప్రకటించిరనియు, 1941 ధరకు 200% హెచ్చుయిచ్చి 1946 ధరల ప్రకారం పరిహారమిప్పించవలెననియు శ్రీ బి. అనంతాచారిగారి అధ్యక్షతన వి. భీమారావు, ఆర్. సూర్యనారాయణరావు మున్నగు రాయలసీమ శాసనసభ్యులు కొందరు పబ్లిక్ వర్క్సు మంత్రి భక్తవత్సలం, రెవెన్యూ మంత్రి శ్రీ కళా వెంకట్రావుగారలను సందర్శించి విన్నవించుకొనిరి. ధరలవరలు ఇత్యాది విషయముల సాక్ష్యము తీసుకొని స్పెషల్ ఆఫీసరు నివేదిక వచ్చిన మీదటనే నిర్ణయము చేసెదమని మంత్రులు తెలిపినట్లు తెలియుచున్నది.

### జమీందారులకు పరిహారం ఇవ్వరాదు

చెన్నపట్నం, సెప్టెంబరు 20:

చెన్నపట్నం మూర్కొమల నాగభూషణంగారు అధ్యక్షతన ఆంధ్రరాష్ట్ర రైతుసంఘంవారు హోంశాఖా మంత్రి పి. సుబ్బరాయన్ గారిని చూచి జమీందారులకు పరిహారం ఇవ్వరాదనియు, ఇచ్చిన నామమాత్రముగనే ఇవ్వవలెననియు నిన్న రాయబారం వెళ్లి చెప్పిరి.

# రాష్ట్రంలో ధాన్యసేకరణ

## దాదాపు 3400 టన్నులు హెచ్చినది

మదరాసు, సెప్టెంబరు 20: సెప్టెంబరు 11 వ తేదీతో అంతమైన వారంలో రాష్ట్రమున ధాన్యసేకరణ మూలమున 21737 టన్నుల ధాన్యం లభించినది. అంతకుముందువారంలో 18355 టన్నులు లభించియుండెను.

ఈవారం ధాన్యసేకరణలో అగ్రతాంబూలం పశ్చిమ గోదావరిజిల్లాది. ఇక్కడ యీ వారంలో 3865 టన్నులు వసూలైనవి. వెనుకటి వారంలో 2836 టన్నులు వసూలై యుండెను. కృష్ణలో యీవారమున 2814 టన్నులు గత వారంలో 2594 తూర్పుగోదావరిలో యీవారమున 1125 గతవారంలో 1110. తంజావూరు యీ వారమున 1434 వెనుకటి వారంలో 1246. గుంటూరు యీవారమున 629 గతవారమున 463. నెల్లూరులో యీ వారమందు 1883 వెనుకటి వారంలో 1664 టన్నుల ధాన్యం వసూలైనవి.

పశ్చిమ గోదావరిలో దాదాపు 1 లక్ష టన్నులు, తంజావూరులో 51000 కృష్ణలో 52100, గుంటూరులో 28000 దక్షిణార్కాడులో 29000, తిరుచినాపల్లిలో 23000 మధురలో 25000 టన్నుల ధాన్యం యీ ఫసలీ సంవత్సరమున వసూలు కావలసియున్నది.

# భోగంమేళాల నిషేధంబిల్లు

## ప్రభుత్వమే ప్రవేశపెట్టడం బాగుంటుందని డా. పట్టాభి సూచన

చెన్నపట్నం, సెప్టెంబరు 20: డా. పట్టాభి సీతారామయ్య పంతులుగారిట్లు వ్రాయుచున్నారు:

శ్రీమతి సీతా మహాలక్ష్మమ్మగారు ప్రవేశపెట్టనున్న బిల్లు ఎన్నడో రావలసినది. 1896 లో నేను 15 ఏండ్ల వాడనై నపుడు సర్ ఆర్. వెంకటరత్నం నాయుడుగారు ఈ ఉద్యమాన్ని ప్రారంభించినట్లు నా జ్ఞాపకం. ఆ ఉద్యమంలో పాల్గొన్న వాళ్లలో నేనొకణ్ణి. అందులో సభ్యులైనవారు భోగంమేళాలు చూడరాదనీ, ఎవరూ ఆడించరాదనీ దీన్ని ఒక చేదుగా పరిగణించవలెననీ ప్రతిజ్ఞ తీసుకొనవలసిఉంది. ఇంకా ఆదురాచారం అల్లాగే ఉండిపోయింది. అప్పటికీ ఇప్పటికీ దేశం ఎంతో ముందుకు నడిచింది. కాలం గడిచింది. కాని గోదావరి విశాఖ, దత్తమండలాలలో ఈ దురాచారం బాగా వ్యాప్తంలోనే ఉన్నది. భోగం కులంలో పుట్టిన పిల్లలకు పెళ్లిళ్లు చెయ్యాలనే సంకల్పం వారికులంలోనూ బాగా వ్యాపించింది. ఇంకా మిగిలినదాన్ని శాసనం ద్వారానే నిరోధించాలి. ఇతర కులాల పిల్లలు నృత్యగీతవాద్యాలు నేర్చుకోవడం కూడదు. భోగంవాళ్లలో నృత్యగీతాలతో బాటు వ్యభిచారం ఆచారమైపోయి ఒక పవిత్రత నాపాదించుకుంది. దాన్ని నాశనం చెయ్యవలసిఉంది. వ్యభిచారంతోపాటు నృత్యగీతాలు మాటమారిపోయి సంఘంయొక్క నీతి చెడిపోయింది. పతితోద్ధరణకు కాంగ్రెసువారు కంకణం కట్టుకున్నారు. ఈ దురాచారాన్ని బాహటం వారి విస్మరించగూడదు. మనవాళ్ళు మొహం పెట్టి సంఘంలో ఉండే దురాచారాలను అంతగా పట్టించుకోరు దీనిని ఒక స్త్రీ ప్రతిపాదించడం ఉచితంగా ఉన్నది. ఈ బిలునుగూడా ముత్తులక్ష్మిరెడ్డిగారి బిల్లుతోపాటు ప్రభుత్వం తీసుకొని అధికారపుబిల్లుగానే ప్రవేశపెట్టవలెను."

